# సెలయేటి గానము

(భావగీతావళి)

ఇది

చెన్నపురి ప్రెసిడెన్సీ కాలేజిలో
సీనియర్ బి. యే. క్లాసులో చదువుచున్న

బసవరాజు అప్పారావుచే

వ్రాయబడినది.



"And face to face, and soul to soul
We greet the monarch—peasant."
[O. W. Holmes on "Robert Burns"]

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు
బి. కే. స్వామిచే
ముద్రింపఁబడియె.

1915.



వెల రు 0—6—0

# పీఠిక.

ఈ "సెలయేటి గానము"లోఁగల గీతికావళిని తీరికయు గునపుడెల్ల వ్రాయుచు నేదో యొకతీరున లోకమున ప్రచురింప నెంచితిని. నన్నీయత్నమునకు పురికొల్పినవి కీర్తిశేషులైన శ్రీ కవిశేఖర గురజాడ అప్పారావుగారి కవిత్వపఠనమును, నా స్నేహితులును, అప్పుటప్పుట నాతోఁడ ననేకవిధముల కవిత్వమును గూర్చి ముచ్చటించి, నా సందేహములబాపి నాకనేక విధముల సాయముజేసిన శ్రీ వింజమూరి రంగాచార్యులు బి.యే. గారి స్నేహబలమును, ఆంధ్ర భాషాభిమానమును. ఆధునిక కవులలోనెల్ల నగ్రగణ్యులై, నాకు పరమగురుసమానులై, నాపుస్తకముఁ జదివి యానందింపఁదగు వారిలోనెల్లముఖ్యులైన శ్రీ గురజాడ అప్పారావుగారు పరలోకగతులగుట నాకు మిక్కిలి సంతాపము గలుగజేసినది. వారు చదివి యానందించవలసిన పుస్తకము వారిస్మృతి కర్పణము జేయవలసివచ్చుట వ్రాసినట్టి నాకును, చదువువారికిని విచారకరము. ఇంతకును దైవవిధి యిట్లున్న వేఱెట్లగును? ఈపుస్తకమును జదివినవారెల్ల శ్రీ గురజాడ అప్పారావుగారి నామము స్మరింపుచు, వారి కవితారసమును గ్రోలి యానందింతురుగాక యను నాశతో కన్నీళ్ళతో నీపుస్తకమును వారి స్మృతికంకితము జేయుచున్నాను.

ఇట్లు

బసవరాజు అప్పారావు.

# విషయసూచిక.



## శ్రీకవిశేఖర గురజాడ అప్పారాయస్మృతి.

---

గీ॥ కోకిలా, పారిపోతివే కోర్కెలన్ని
వమ్ముజేసి, శోకమ్మున మమ్ముముంచి
చూపులకు నందరానిదై చోరనశక్య
మైన మరుభూమిజొచ్చితే మమ్మువీడి

గీ॥ శీతకాలమ్మునందెల్లొ చిక్కి స్రుక్కి
చాటుమాటునదాగుండి, సరసమగు వ
సంతకాలమువచ్చెడు నంతవగకు
ఓపికనుపట్టలేవైతివే, ప్రియసఖీ !

గీ॥ వెఱ్ఱిపడియెదుగాని నీవెఱుగవైతె ?
ప్రకృతిమార్గమ్ములకు నడ్డువచ్చునంటె ?
వేసవిచనంగ దానివెన్వెంటవచ్చు
శీతకాలమురాకుండ జేయగలవె ?

గీ॥ దివ్యమానీదు గానమ్ము తీపి వీర
లకు రుచింపకపోయె, నీవన్నయట్లు

"తోయ్యబొమ్మల"నే మెచ్చుకొనెడి వీరి
మతుల కెక్కునె యొకనాడు "కోమలుల పాట" ?

గీ॥ అంతమాత్రాన వీరిపై నలుగ నేల ?
వెలుగు చీకటి యొక్కచో వెలయుగాదె ?
ప్రకృతి వైధర్మ్యమిట్టుల బరగ, మమ్ము
నలుకమై వీడ నిన్నేమి యనగలమయొ?

గీ॥ ముందువచ్చు వసంతమ్మునందు నీదు
క్రొత్త గీతము విననెంతొ కోర్కెనుంటి,
నింక నేమివసంతమ్ము? నీదుపాట
వినఁబడదు గాబోలు మావినులకిక ?

గీ॥ మరచిపోకుము నెచ్చెలీ ! మమ్ముదలపు,
మమరులలరి చేష్టలుదక్కి యాలకించ,
లీనమై హాయి, నీదివ్య గానరసము
చిలుకునప్పుడు నీదు నెచ్చెలుల మంచు !

ఇట్లు, నీస్మృతికై వగచు
ఆంధ్రకవిత.

---

అవిఘ్నమస్తు.

# మా అమ్మ చావు.

"ఎదలోని సొదచేరు నెదకలవారి"

---

పుట్టితినేచాల పూజ్యులయింట
తల్లిదండ్రులకు రెండవ బిడ్డనౌచు.
నాకన్న పెద్దది నాతోడబుట్టు,
చక్కనిచుక్క, మతాబు వెలుగంటి
మేలిమి బంగారు మేనిదౌ చాయ.
తెల్లజాంపండని చూచినవారు
ముచ్చటపడి యెంతొ ముద్దాడువారు
జాబిల్లికేమైన కళతగ్గునేమొ
కాని, ఆమె మొగంబు కాంతి తగ్గదుగా.
మూడేండ్లవాడనే నయిదేండ్లదామె
చిన్నతనమునుండి దిప్పకాయౌచు
చేయరానల్లరి చేసేటివాడ.
కాని మాయప్ప తాకనులలోవత్తి
వలెనుండి, నోటిలో నాల్క లేనట్లు,
యెవ్వరేమన్నను తను కాదనుకొని,
తిట్టిన తివిరిన కోపానబోక,
శాంతమునకు పుట్టినిల్లయి పెరిగె.

చిలుకగోరింకలవలె నుంటిమేము,
కన్నట్టివారికి కడుపు పంటగను,
చూచేటివారికి చోద్యమ్ముగాను.
మాయమ్మకంతట నిండుచూలొచ్చి
మాయదారీతమ్ముఁ డొకఁడు తాపుట్టె.
ఎట్టివేళను ధరఁ బడ్డాఁడో వాఁడు,
పుట్టినప్పటినుండి మాకన్న తల్లి
బాలింత గుణముచే బాధపడుచుండె.
రోజు రోజునకును రుగ్మత హెచ్చ,
అమ్మవొంటిని సత్తువడుగంటిపాయె
రోగము హెచ్చగా మంచముబట్టె;
మది దిగులుపడిరి మావారలెల్ల.
అమ్మకు గుండెలో అడదడ హెచ్చె;
మాయనం జామెకు దాపురమాయె
యేవేళ కేకేడు మూడునోయంచు,
నరచేతులందు ప్రాణాలు బిగఁబట్టి
పిచ్చివాడై తండ్రి అల్లాడుచుండె.
లోకములో మందుమాకులనెల్ల
ఇప్పించిరామెకు ఇదిఅది యనక.
యెన్ని మందులనిచ్చి యేమిఫలమాయె ?
యెన్ని మాకులనిచ్చి యేమిఫలమాయె ?
కాలముకర్మమూ తప్పివస్తుండ ?
స్వర్గమునుంచి అమృతముకొని తేనీ,

సంజీవి కొనితెచ్చి సేవించేసియనీ,
జరుగవలసిన కర్మ జరుగకపోనా?
"మాయమ్మభూమిపై భత్యమ్ములేదా?
బ్రతుకడానికినీకు రోజులు లేవా?
ప్రాణముమీద నీకింతలోవిసుగా?
నూరేండ్లు అప్పుడే నిండిపోయినవా?
కనిపారవేస్తి ముగ్గురుపసికూనల,
వాళ్ళకు గతియేమి జెపుతావుతల్లీ?
ముక్కాలి ముదుసళ్లు నీతల్లిదండ్రులు,
వాళ్ళకు గతియేమి జెపుతావుతల్లీ?
పట్టుకొంపమ్మవటంచు నమ్మియున్నాడు,
పెనిమిటిగతియేమి జెపుతావుతల్లీ?
అక్కలు చెల్లెండ్లు, బావ మఱఁదులు,
అన్న దమ్ములు, పదినెలు, మఱదండ్రు,
చుట్టపక్కాలు గంపెడు బలగమ్ము,
వాళ్ళకు గతియేమి జెపుతావుతల్లీ?
ఇందరినీవీడి యేగనొంటరిగ,
మనసెట్టులొప్పెనే మాయమ్మనీకు?
నీయన్నలక్ష్మయ్య, నీపెనిమిటియు,
వైద్యునికోసమై పరుగెత్తినారు,
వచ్చినదాకైన బ్రతుకవేతల్లీ?
"పాకలోమంచము పారేస్తిరేమి?
యీకాస్తసేపులో యేమిమునిగింది?

చెయిజూడు, వెంకన్న, చెయిజూడు బాబు,
గతియేమి? ఆశలుకలవమాకింక ? ”
చెయిజూచె, చెయిజూచె, వెంకన్న తాను,
చూచిచూచి పెదవి విరుచుచునుండె.
కనులు పైకెత్తుచు కనుచుండెనేమొ.
మొగము వెలవెలబోయి గుడ్లనీర్గ్రుక్కె.
“యేమోయి వెంకన్న యేమిమూడింది?
యేమియోచింతువు? యేమిమాకుగతి?
“యేమియున్నదిచెప్ప నేమింకగలదు,
యేమనిచెప్పను యెటువచ్చునోరు?”
అంచు లోలోపల నడలె వెంకన్న.
గొల్లునఅందరు గోలకెత్తిరయొ !
కటికనేలనుబెట్టి కన్ననాతల్లి,
గుండెలు వెతబాదుకొనుచు, నెగ్గెత్తి
పెద్దపెట్టున చాల విలపించినారు.
కన్నతల్లింతలో కనులు విప్పింది;
యేడ్పుసంతసమొచ్చె నేకకాలమున.
చావు తెలివో, లేక చనెను గండంబు ?
యేడ్చుచున్నవారు యేడుపుడిగిరి;
ఆశలుకలవార లరయుచునుండ్రి;
పడియున్నవారెల్ల పైకిలేచారు.
కంఠమువిప్పింది కన్ననాతల్లి,
విన్నాముకడసారి కిన్నరగొంతు.

యెక్కడలేని ధైర్యము దెచ్చుకొనుచు,
"రామయ్య తండ్రీ! రాయిట" కనెను.
రామయ్యతాదగ్గరకు వచ్చె నంత,
"పిల్లలనిచటికి పిలు"మనె తల్లి,
చెచ్చెరతెగదెంపు చెప్పింది తల్లి,
మమ్ము ముగ్గురి చేర రమ్మని పిలిచె,
చెయివేసె రామయ్య చేతిలోతల్లి,
కనులంటజలజల కారెనునీళ్ళు,
నన్ను జూపుచునను నయముతో తల్లి
"రాముడూవీడుపూ రాగుండవాడు,
యేలాగొ బ్రతుకు, లేదేమియ్యూ భయము"
అనుచు, వేలెట్టి, మాయప్పనుచూపి,
"ఇదిపిచ్చిబిడ్డ, నోరెఱుంగనితల్లి,
తలో మొట్టికాయ తగలనీకండి."
అనవిన, గుండెనీరయ్యె రామునికి,
చుట్టున్న వారేడ్చుచుండిరి బిట్టు;
ఇంతవాండ్లకుమాకు యేమిటియెఱుక ?
తమిచంటిబిడ్డను దరికిదీసుకొని,
పెద్దకౌగిటగుచ్చి, ముద్దుబెట్టుకొని,
స్తన్యమునిచ్చి, "నాయన్న యిదేనీకు
కడసారిపాలివ్వ గలుగుభాగ్యమ్ము.
నినువీడిపోవంగ మనసురాదు, కల
కాలమువర్ధిల్లు కన్న నాతండ్రి."

అంచు, దీవించి ముద్దాడిముద్దాడి,
కనులుమూసుకు, ప్రాణికను తెంపుజేసి,
ప్రేమచంపుకు, చంటిబిడ్డనుదీసి
అందిచ్చెరామయ్య కంతనాతల్లి.
కనులువిప్పినదంత కన్న నాతల్లి,
తళతళ మెఱసె నాతల్లి నేత్రములు,
కనులుమూతవడియె,కన్నైతిమేమి,
పోవచేష్టలు, రాతిబొమ్మలవ్రాలె
నుంటి, మీమాటలు వింటిమెతుదకు,
"రామయ్యతండ్రీ! సీతమ్మతల్లీ."
కనులువిప్పితిమేమి కానరాదాయె,
మాయమ్మప్రాణమ్ము మాయమైపోయె.

## —• 2. పారిజాతపుప్వులోని చీమ. •—

గీ॥ అయ్యయో, చిన్నిచీమ, నీ వాసతోడ
పారిజాతంపు పువ్వులోపలను జేరి
హాయిగా మకరందము నానుచుండ,
దిగువకుఁ ద్రోసితిని, పువ్వుదీసుకొంటి॥

గీ॥ నయ్యయో! యెంత ప్రీతి నాయమృతమ్ము
ద్రావుచుంటివి గద! మది దయను వీడి
ఆకలింగొన్న నినోటిదైనకూడు
తసినందుకు నన్నెంత తిట్టినావొ!॥

గీ॥ 'మనుజు లెంతటి పాపాత్ము'లనుచు చింత
పడితివో గద! యెంత క్షుద్బాధతోడ
నవల చెట్టుకుపోతివో, అచటనైన
నమ్మకముతోడ భుజియించినావొ లేదొ? ॥

గీ॥ అన్న! నాతప్పుమన్నించు, చిన్నిచీమ!
పువ్వులోపలనీయుండు పోడ యెఱిఁగిన
నింతపాపంపుపని జేతునే? తెలియక
నీకు చెరుపెంతో చేస్తి మన్నించుదయను!॥

గీ॥ పారిజాతంపుపువ్వ! నీపరిమళమ్మ
దెంతయింపైన నామది సంతసమ్ము
జెంద, దాచిన్ని చీమకు జేసినట్టి
చెరుపులోనెంచ నామది చివుకుమనును॥

## —♦ 3. ఒంటరి చుక్క. ♦—

గీ॥ కాంతియే లేని కటికచీకటి నడుమను,
బిక్కవోయినమోముతో, పెంపుదక్కి
పులుకుపులుకంచు ఊరికే పొగిలెదేల?
యేమిపుట్టెనె? ఓచుక్క! యేమైతివేమొ?॥

గీ॥ చెలువులాతోడి చుక్కలంజేరఁబోక,
నొంటివై మోముపంచుకు, నోడలువడక
యేలనంతగ యేడ్చెదే? యేమికర్మ
మొచ్చెనే? వేగ తెల్పవే? ఓర్వలేనె॥

గీ॥ చెప్పవేలనె నీమది చించుచున్న
చింతలను తోడివారితో చెలిమిగదుర ?
నమ్మదగు వారు కారో ? వినంగరాదో
నీదుసొద ? "వీరితో జెప్పనేమిలాభ
మున్న? దెందుకు ఊరికేనోటిచేట" ?
టంచులోలోపలనె క్రుక్కి అణులుదువటె?

గీ॥ పిచ్చి బిడ్డరో ! యీమాత్రమెఱుఁగలేవె ?
లోకమున చుట్టముల్ చెలుల్ శోకమప్పు
డడిగి తెలుసుకు ఓదార్తురటె ! మనంత
మనమె మనకష్టసుఖములు వినిచి, యెడఁద
బరువు తగ్గింపవలెగాని, వగవదగునె?

గీ॥ కష్టములు ఒక్కనీకేనకల్గినవి ? పు
రాకృతముబల్మి నెల్లవారలకుఁగల్గు,
నంతియేగాని, నీకుమాత్రమ్మె కీడు
జేసి, దేవుడు పాపంబుజేయునంటె ?॥

గీ॥ చిన్నిబిడ్డవు, జీవంపు తెన్ను నెఱుఁగ,
వ్వారికేమెందుకీవెట్టి యూహగొనుట?
ప్రేమకుఁ ఫలముప్రేమయే, వేఱేకేల ?
కష్టమున బంధుమిత్రులక్కరకురారు.

గీ॥ 'కష్టమున బంధుమిత్రులక్కరకురార'
టంచువగవంగనేల ? నీకన్నిటికిని

కాంచి పెంచిన దైవమేకలడుగాదె ?
ఆతని నేనమ్మ ! మరచిపోమ్మన్ని వెతలు॥

గీ॥ యేడువంబోకు, నావంకజూడు, మోముఁ
నెత్తు, మేలాగొ మఱచి పో, మ్మేడ్చియేడ్చి
ప్రాణముఁ గోలుపోనేల? బ్రతికియున్న
యెన్నటికినై నకృపజూడకున్నె దైవ ?
మంతకఠినుఁడా ? క్రూరుడే? అక్కటకట?

---

## —* 4. ప్రార్థన *—

గీ॥ యేలనన్నేడిపించెద? వింతకన్న
భాగ్యహీనుడుదొరకక పాయెనే? వి
శేషదుఃఖములకునోర్చి, చిట్టచివర
కెట్టులో బయటపడనున్నయట్టి నన్ను
మరలదుఃఖములో ముంచి, మంటఁగలిపె
దేల నాజీవితమ్ము? నీకిది ప్రియమ్మొ॥

గీ॥ కటకటా! భువిపుట్టువుగాంచినందు
కేమిఫలమాయె? నాగతియిట్టులగుట
కేమిపాపము జేసితి? నీవిచార
మందరకునిట్టులేలుండు? నయ్యొ! పాపి
నైననాయట్టివానికి నబ్బుగాని!

గీ॥ ఈశ్వరా! నీకు నాపైన నేలనింత
నిర్దయత? నిన్ను నేనెప్డు నిర్మలమగు
మనసుతో ధ్యానముం జేతు, మాటలందు,
చేతలందును, నీయాజ్ఞ చేయకుంట
యెఱుఁగ, పరులను హింసింప నెన్నఁ డేని!

గీ॥ చెఱుప లేదెన్న డును, నన్ను జేరి, "మిత్ర
మా, దయం గావు" మని వేడినట్టివారి,
చిన్నతనమున నే తప్పుఁ జేసినానొ
చెప్పఁజాలను గాని, నాజీవితమ్ము
పాడుగా వలసినయంత పాపకర్మ
నెన్నడునుఁ జేయ లే, దిది నిజము నమ్ము॥

గీ॥ నిజముగా తప్పు జేసి నానేయనుకొను,
మంతమాత్రానె నన్నిట్టులష్టకష్ట
ములకు పాల్జేసి, నాపై ప్రజూడకుండ
కనులు మూసుకు కూర్చుండ కారణంబు
లేదు, యికనైన కన్నులు లేవనెత్తి,
చల్లనౌ చూపులం జూచి సాకుమయ్య

గీ॥ కరుణగలదైవమా! నీవు గాక నాకు
వేఱు దిక్కెవ్వరును లేరు, వేగ బ్రోచి,
నన్ను దరిజేర్పుమనుచు నిన్నడుగుచుంటి,
నాదు దీనతఁ గని, వేగ నన్ను గావు,

పరమపావన! పరమేశ! భక్తవరద!
కష్టదశనున్నవారినిఁ గాచువాఁడ!॥

## —* 5. కలలో మాఅమ్మ *—

గీ॥ అర్ధరాత్రాయె, నెల్లెడ నాకసమున
కాఱుమబ్బులు చుక్కలపారదోలె.
కప్పలరచుచునుండె బెక బెక బెకని,
నిద్రరాదయ్యె కనులకు నించుకైన.॥

గీ॥ హాహారుమని మ్రోగె సంద్రము, ఘోరమైన
చిమ్మచీకటు లెల్లెడ గ్రమ్ముకొనె, మ
హారవమ్ములు వినవచ్చె నాకసమున,
హృదయమంతయు వికలత నొందఁజొచ్చె॥

గీ॥ వికలతను జెందె నెద, మది భీతి మునిగె,
చెప్పరాని వికారంబు ముప్పిరిగొనె,
తలపులన్నియు నెచటికో తొలగిపోయె,
గాఢమానంధకారంబు కప్పుకొనియె॥

గీ॥ చుట్టుపక్కలజనులెల్ల సుకముగాను
నిదురవోవుచునుండిరి, నేనొకడనె
ప్రకృతిమాత్రమెతోడుగా భయముతోడ
కన్నులెత్తి తెప్పలువాల్పక కనుచుంటి.

గీ॥ కనుచుకనుచుట్టు లేయుండ, కనులుమూత
వడియె నెట్టులో కొంత సేపటకి, "యేమి

కటకటా! యెన్ని యున్ననో కన్నతల్లి!
నీ వెయున్నట్టులుంటునే నిజము జెప్పుమ!

గీ॥ సౌఖ్యముల కేమిలోపంబు జరుగలేదు
ధర్మగుణశీల ముత్తె నతల్లికరుణ
బలిమి చే, బాల్యమంతయు పరమసంతి
సమునసోదరితో గూడ సాగిపోయె.

గీ॥ బాల్యమిట్టులుగడచె, నాపుమునిచదువు
సంగతుల శ్రద్ధతోడ మెలంగుచుంటి,
విద్యలో నెన్నికనుగాంటి, పేరుగంటి
మంచివాడను, కడుబుద్ధిమంతుడనని॥

గీ॥ మిత్రులకునెల్ల ప్రేమమ్ము మిగులఁజూపి,
వారియనురాగమునుగొంటి బహులుగాను,
బంధువులనెల్ల ననురాగబలిమి పూర్ణ
హృదయమానసెప్ప ప్రేమించి పొంగుచుంటు॥

గీ॥ కలుష మేమియు నల్పనోకన్నతల్లి,
బ్రహ్మకునురాశిగుండెనో, పరమప్రకోర్య
మే అకస్మాత జగుంగెను, నుశేముచేటు
కాలమో, చెప్పగతరమ్ముగాదునాకు॥

గీ॥ ఇన్నికష్టమ్ములోర్కసాగినవెంట
[illegible]నతఁడమినన్నింత వేచనేల!

మనుజులిక్కట్లు వడ జగమందుగనమె?
అయ్యయో, యింతవిపరీతమాయెనె? తల్లి?॥

గీ॥ చిన్నతనమున ప్రేమతోవిద్యజెప్పి
నట్టిమామను మృత్యువుపట్టిమ్రింగె
నకట! యిప్పటి నావిద్యనంతయువిన
నెంతముదమందునో! ప్రేమ నెటుమరియును!

గీ॥ తల్లిలేనట్టికూనల దరికిదీసి,
చిన్నతనముననుండియు పెంచినట్టి
ప్రేమమూర్తులు, వారలమ్రింగిమంటె,
తాతముత్తవలే, వారుదయివములెగ?॥

గీ॥ ప్రేమతో భారతమ్ము, శ్రీరామకథయు
దినదినము, అక్కనను జేర్చి, తియ్యనైన
పూతవాక్కుల జెప్పిన తాతఋణము
బ్రతికియుండగ తీర్పగాఁ బడయగలనె!

గీ॥ కడుపుననుగన్న బిడ్డలకన్న మమ్ము,
పెంచినట్టిమోహమ్మున, ప్రేమరెండు
రెట్లుగా, చెమటలోడ్చిన ప్రేమబెంచె,
నామెఋణమును జన్మలోనగునెతీర్ప?॥

గీ॥ సోదరీ, మేల్మిబంగారు సోయగంపు
దేవకన్నరో, నీకును తీటెనమ్మ

బ్రతుకు, నీరోజులవిచెల్లిపాయెనమ్మ ?
మఖనుజన్మించి పుబ్బలో మాయమైతె ?॥

గీ॥ కొత్తలో కాలదిరుగంగ కోర్కెపుట్టె
నమ్మ ? ముద్దులసోదరీ ! నమ్మియున్న
తమ్మునిచ్చుటనేవిడితమ్మ ? నీకు
తెలియదే ? నీవులేకున్న నిలువగలనె ? ॥

గీ॥ తల్లికనివేసిపోయిన దాదిగాగ
కష్టసుఖములనోర్కెతై, కన్నతండ్రి
ప్రాణమును సుఖపెట్టగా వలయునంచు
కోరుకొను కోర్కెలను మన్నుగొట్టిపోతె ?॥

గీ॥ సోదరీ ! పోకుపోకు, నాసొదనొకింత
దయనువినిమరలిపొమ్మ, యెదయిననాకు
గతినిజూపించిపొ, మ్మంతకఠినమేల
నమ్మ ? పోయితె ! అయ్యయో ! ఆగుమాగు" ॥

గీ॥ "నాయనా ! తండ్రి ! మూర్ఛిలినావె ! అకట !
కష్టవార్తను చెవినైచి, కనులయెదుట
వాడిపోయెదవేల ? నీవంతనాకు
మాత్రమునులేదె ? వగవకుమంతబిట్టు॥

గీ॥ నాయనా ! యేమిచేయంగనౌనుతండ్రి !
ఆపదలకేమి మనపైన నాదరమ్మొ ?

మవ్వపు మునిమునినవ్వుల వెన్నెల
పువ్వుల నెల్లెడ రువ్వగ జాబిలి,
నవ్వు చువలపుల పవ్వము జేయక
పువ్వుబోడి నీవవ్వల బోదువె ?
చక్కనిదానా యెక్కడికే?
ఒక్కతెవు యిపు డెక్కడికే?
మంచుకొలనుపై అంచలజోడటు
మించుచునీదుచు సంచరించెగను
చంచలాక్షిరో, వంచన జేయుచు
కించలలోనను ముంచిపోదువటె ?
చక్కనిదానా యెక్కడికే?
ఒక్కతెవుయిపు డెక్కడికే?

---

## 8 సంగీత సుఖము.

గీ॥ ప్రబలమగు మండు వేసవి ప్రకృతి కాల్చి
చెండుచుండగ, చల్లని చెట్టునీడ
రమణి యొక్కతె తాంబూల రాగమునను
నరుణమగు పెదవులు, నల్లనైనముద్దు
మోమునను కుంకుమపు బొట్టు, ముంతకొప్పుం
గలిగి, యొడినున్న తమికెల గంపమీద
దరువు వేయుచు పాడుచు, తళుకు బెళుకుం
జూపి, నానాడినున్న క్రొ సొనను బాపె.
పాడను బాపుట లోగల చోద్యమేమి?

సుందరియొకర్తె సంగీత సుఖసముద్ర
మందు చుక్కాని లేక నానందవాహ
యై, నదినినీదుచుం బాడునంచయట్లు
లకలుషితప్రణయరాగంబు నాలపించ,
ప్రకృతిపరవశ కాదె? దైవమునువినడె?

—* 9. ప్రేమ కారణము. *—

గీ॥ కారణం బేమనందునో కాంత, నీదు
ముద్దుమోమందమో, లేక, మోహపార
వశతనిటునటు చలియించు వాలుకనుల
యందమో, కెంపుపెదవులసందునుంచి
తొంగిచూచుచువెంటనే తొలగి లోని
కేగుచునుమోముసీమపై నిచటనచట
మెఱుపుమెఱపించు మవ్వంపుచిరునగవుల
చందమో, లేకముంగురులందమానొ !
ప్రేమకుఁగల్గు కారణం బేమనగల
మింతిరో నిన్నుఁజూడ ప్రేమించుఁబెజూమి !
ఇంతియేగాని వేఱ్వేఱనెంచిచూచి
అందపుందళుకులనె ప్రేమనందఁగలనె !
తెలియు, నాత్మను ఆత్మనుకలిపి కుట్టు
దారమే నాదుప్రేమకు గారణమ్ము॥

## —* 10. సొగసునేరము *—

గీ॥ పడతి, నన్ను నవలసినపనియె లేదు,
పసిడిమైదీగెపై నాకుపచ్చచీర
గట్టి, మోమున నిలువుగా బొట్టువెట్టి,
సందె కాంతులు మోముపై సిందులాడు
తేకువద్దు, చెవుల బెట్టిన తెల్లరాల
దిద్దులజత తళతళమని తేజరిల్ల,
స్తంభమున కానుకొని కడుసరసములగు
నోరచూపుల ననుదరిం జేరంబిలచి,
మువ్వపున్న పువ్వుపువ్వుల యవ్వినట్టి
లలితమగు నాటనిమూర్తి దలచి, యెంత
మోడుమనసైన చిగురించి మొలకలెత్తు,
నట్టిచో, ప్రాణమంత నీయందె నిలిపి,
వలపునికౌగిలినె జీవఫలముబడయు
నున్న నేనెట్లు ప్రేమమునుంగ కుందు?

## —* 11. సహజలావణ్యము *—

గీ॥ మోముతీరు సామాన్యమే, ముగుద, కురులు
ముడిచి, కుంకుమతిలకమ్ము మోమునిడి
నంతనే యింతసొగసెట్టులబ్బె? జెప్ప
వే, చెలి, వినంగ నామది వేడ్కపుట్టె.
తీగదీపమ్ము దీప్తి నద్దెసలబర్వ
చదలచీకటి నిటునటుకదలబాఱ

జేయుచుండ, నెయ్యారమ్ము చెలగ నిలచి
మాటలాడెడినీ సౌరు మనము గొనియె.
చెలియరో, దేవలోకమ్ము చేడెలవగు
లోపమే లేని యుత్తమ రూపములను
గంటిగాని, యదేమో, నాకన్నులకును
నీదుమూర్తియె మోదమ్ము నించె, నిజము,
ఉత్తమసాగసు, జీవసంపత్తి గలుగు
సహజలావణ్యమున కెట్లు సాటివచ్చు॥

## —* 12. "నీవు లేని ప్రకృతి యదేల?" *—

గీ॥ పశ్చిమంబున నెల్లెడ బర్వె నరుణ
కాంతు లపురూపమై నట్టి కాలుతనము
గలిగి, కొండలలోనుండి జలజలమను
మృదులగానము తోడ సెలయేళ్ళు పాఱె,
దవ్వులలె నిల్చి తాళబృందములు మెల్ల
వీవనలు వీచుచుండగ నీసుప్రు లేక,
హాయిమని యిటులటులూగు నలలతోడ
పూర్ణమైపోవు యమునలో పోయి చేరు
నతివరో! ప్రకృతియంతయు నమరె సౌఖ్య
దాయకంబయి, అల్లదె కోయిలయును
వింతయై మును పెన్నడుగ విని యెఱుగని
వలపుగానము నింపుగా చిలుకుచుండె,
హృదయము పొంగియు పొంగి నీవు లేమి
క్రుంగు, నౌ, నీవు లేని ప్రకృతి యదేల?॥

## —* 13. మొగిలులోని నాముద్దుగుమ్మ. *—

గీ॥ మొగిలుచాటునదాగుని, ముగుద, యేల
వింతచేసన్నలనునన్ను వెఱ్ఱిఁజేతు?
చెలిమిగోరిన నెక్కింతజెప్పరాదె,
ఇట్లెత్తెక్కలుగట్టుకు నెగిరిరానె!॥

గీ॥ వానచినుకుల తీయనిపాటబాడి
యేలచప్పులూరజేసెదే, యింతి, నీకు
వలపుకలిగినకొంచెము తెలుపరాదె,
ఇప్పుడేచినుకుబట్టుకు నెక్కిరానె?॥

గీ॥ మెఱుపుసందునతళతళమెఱసి, యేల
మేలమాడెదె నాతోడమెలత, వేగ
చూపదలచిననెయ్యము జూపరాదె,
చింతలన్నియుమాని నిన్జేరరానె॥

## —* 14. కలలోని వింతయింతి. *—

నవ్వుతామూర్తిగొన్నటులుండనేగాని,
నవ్వినట్టులనె కానంగరాదు.
మెఱుగుగమిక్ కన్నుమిఱుమించెనేగాని,
మెఱసెడునగలేవి మేనలేవు.
కన్నుసైగలనన్ను గారవించెనెగాని
కన్నులవెచ్చటం గానబడవు.
కాంతుమెయిన్నన్ను కౌగలించెనెగాని

ఒడలు తాకినయట్లె యుండలేదు.
మోముమోమున జేర్చి ముద్దిడనేగాని
మాఱుముద్దిడబోవ మాయమయ్యె,
మాటలాడంగబోయెను మూఁడ్కి గొంతు
విప్పెనేగాని యేమియుఁ వినబడదయె.
కనగ నిజమును, తలపగా కానరాని
భ్రాంతిగూర్చిన నావింతయింతియెవరో?॥

## —* 15. ప్రణయసందేశము. *—

సీ॥ మల్లెపువ్వ! దయంబూమ్ము, మగువ తెల్ల
వారగనె తోటలో పూవులేరవచ్చు
చుండ కనుపించి చెప్పుము, సుందరి! నిలు!
ప్రియుడు నీకొక వార్త నంపెనిదె వినుము॥

గీ॥ 'కోమలీ నాఁడు వనములో కొలనుదరిని
చేయదగు బాసలన్నియుఁ జేసితిగద.
ఇంకనైనను దయజూపవేమి నీదు
చెలిమికై చిక్కి స్రుక్కె నీస్నేహితుఁడయి?॥

గీ॥ గుండెలుగరిసెవడె, మేను బెండువడియె
నతివ, చల్లనినీకౌగిలబ్బకున్న,
కనులు రెండును కాయలుగాసె నీదు
చూడచక్కని నెమ్మోము జూడకున్న॥

గీ॥ చిత్తమునతత్తరముహెచ్చి, చెప్పరాని
యోచనలుపుట్టి మనము నెక్కుమ్రుడిగను
వేచుచున్న పెచెలియ, యీ వేదననుభ
రించలేనె ప్రేయసి, కరుణించవెనను!

గీ॥ నిజమునీవద్దదాచిన నేమిఫలము?
ఎన్నటికినైన కృపజూతువేమొ యనుచు
ప్రాణమరచేతులో బిగబట్టినాను
చేయివిడిపోకమున్నె నన్జేరి కావు?

—* 16. టక్కరిచెలి *—

పోకుపోకుము, చెలియరో, నీ
పోవుచోటదియెఱుగనను లే,
పారిపోయిన నిన్నుతరుముకు
పట్టరాననుకొంటి వే॥

పూలతోటలఁజేరిదాగిన
పొంచినినుపట్టెదను, పొలతిరో,
దూరినను పొదరిండ్ల వెదకుచు
జేరినిన్నట పట్టి నిలిపెద॥

మావి తోట్లను జేరినక్కిన
మగువరో, నినుదెలియలేనే?
పడతిరో, నీమేనిచాయయె
బయటపడు నామావిచెట్టున॥

ముగుద, కొలనునదూరిదాగిన
మునిగియాడుచు నిన్నుబట్టెద,
సకియరో, నీమోవి తేనెల
చవులె నాకట దారిజూపును॥

ఎక్కడున్నను యెచ్చటనక్కిన
టక్కరిచెలీ, నిన్నుగాంచెద,
పారిపోయిన తఱిమిపట్టెద,
పట్టుకుని యే శిక్ష వేతును?॥

—* 17. "నీదుగుట్టంత తెలిసిపోయె" *—

గీ॥ చెలియరో, నీదుగుట్టంత తెలిసిపోయె
మొట్టమొదలుగ పెదవులఁబుట్టె, మోము
నంతబర్వె మెఱపించు లేనవ్వుతీరె
వలపుకలదంచు రూఢిగా తెలిపె నాకు॥

గీ॥ వాకిటన్నిల్చి నన్గాంచు పట్టునందు,
నిటునటుచలించు నీకనులింపుగులుక
మనమునందుండుభావమ్ము గనబరచుచు,
వలపుకలదంచు రూఢిగా తెలిపె నాకు॥

గీ॥ తిన్ననైనట్టిమెదీగ తెల్లచీర
మాటుననుకంపింప, నంగములుకదల,
మెఱుపులెల్లెడఁజిమ్ము నీమేనితొగలె
వలపుకలదంచు రూఢిగా తెలిపె నాకు॥

గీ॥ ముక్కు ముంగిరసవరింప మోముమంచి,
మురువుగు ల్కెడు బంగారుముంగురులలరు
చిన్ని చేతులు కంపమ్ము జెంద నెత్తి,
వలపుకలదంచు రూఢిగా తెలిపినావు॥

గీ॥ చుక్కలను నందమైన కంచుకమునందు
నుండి వెలికుబ్బిపొంగు నీయురముతీరె
హృదయమందున్న యుల్లాసమెఱుగ జేసి,
వలపుకలదంచు రూఢిగా తెలిపెనాకు॥

గీ॥ యెన్నినాళ్ళని నీగుట్టునిట్లుదాతు?
వలపుకలిగిన నెపుడైన బయలుపడదె?
లోన నను వేచవలెనను ప్రాన్కగాక
వలపుదెలిపిన తప్పేమికలదె, చెలియ?॥

—* 18. ప్రణయబోధ *—

గీ॥ ప్రేయసీ, యొక్కమాట జెప్పెదనువినుము,
కోపపడబోకు, నీమేలుకోరియెసుమి
చెప్పుచుంటిని, దీనినీచిత్తమందు
నిలుపు, మీపల్కుల విలువ తెలియుపిదప.
వాలుజడవేసుకు, గులాబివలువగట్టి,
పొంకముగ కురుల చామంతిపూవుముడిచి,
మేల్మిబంగారుమురుగులు మెఱయుచుండ,
నన్ను మురిపించి తదిజ్ఞప్తి యున్నదిగద!
అల్లయానాటి నీసొరెయుల్లముగొనె,

గానయింకెప్పుడైనన్ గనగ తలపు
కలిగివచ్చిన యప్పుడో కలికి, నాటి
వరుసకనుపించకున్న నీ వలవనుసుమి!
చెలియరో, న్యాయమౌగాదె! చెలువునిమది
వలపుగొల్పిన చెలువమే వలయుచెలికి॥

## 19. ప్రణయభ్రాంతి.

### ముత్యాల సరము.

"ఎవ్వరో యితఁ? డెందుచేతను
యేడ్చుచున్నాఁడిచట కూర్చుని?
పలకరింతునదరికిజని, యిటు
వగవనేలనుచున్॥
చూడచక్కనివాఁడు, కన్నులు
చూపుచున్నవి గొప్పతెలివిని,
కట్టుమస్త్రీ వాళ్ళుగల యీ
కాంతుఁడెవ్వండో?॥
ఎఱ్ఱఁబడినవి వీని కన్నులు
యేడ్వ, జేగురుముద్దలంబలె,
కళ్ళవెంబడి కారునీళ్లకు
కట్టలేదుగదా?॥
కటకటా! ఆముద్దుమొగమున
కాంతియంతా మాసిపోయెనె,
పెల్లుపెల్లున ఇంతయేడ్వగ

నేమికారణమో ?॥
శిరమువంచి, మొగమ్ముపైనొక
చెయ్యి, వేరొక చెయ్యి చెంపను
నిడుక, బిట్టుగ నేడ్చుచున్నా
డితనిపైనొకరు॥
అయ్యయో, మదిజాలిపుట్టెను
నడుగఁగలనెటు ? కొత్తవాఁడిత,
డడుగకుంటే పాడుమనసది
ఆగకున్నదిగా ?॥
జాలిముందుకు లాగుమనసును,
కాలువెనుకకులాగుసిగ్గయొ !
మేరమీరిన దితని దుఃఖము,
నేఱనికనాఁగఁ॥
అంచుమదిలో తెంపుజేసుకు,
అడుగుముందిడి, అతనిదరిజని,
"యెపుడో మునుపెరిగినట్లే వుం
దేమి యీ మొగము?॥
ఔన ! ఇతడతడౌన ! యిట్లే
లాతడుండును ? మనిషిపోలిక
నెందరుండరు జగతిలో ? నీ
కెందుకడియాస?"

అంచు, పొంగుచుపైకి పొర్లే
ఆసలన్నీ లోపలణచుకు,

పలకరించఁగ గుండెచాలక,
నిలిచె బొమ్మవలె॥
నిలిచికొంచెము అతని పక్కను,
నెవ్వరొయొకడువింతతలఁపులు
కలుగ, మనసును పట్టఁజాలక
పలికెనిట్టులను॥
"తప్పుఅనుకోకండి ! యెంతటి
గొప్పవారోమీరు, ఒంటిగ
వగచుచుండగఁ జూచి మనసును
పట్టలేనయితిఁ॥
పట్టలేకను పాడుమనసును
భయమువిడి మిమ్మడుగుచుంటిని.
చెప్పుటకు మీకిష్టముంటే
చెప్పవేడెదను ?॥
పొద్దుగూకిన పిదపనిచ్చట
వున్నకిడో నెంతవాళ్ళకు
చెప్పవచ్చునులెండి మీకథ
చింతకుదుటపడకఁ॥
లెండిపోదాం, దగ్గిరే ప
ల్లెగల, దచ్చట పేదలింట్లో
విందుగొని సుమధన్యులను జే
వేంచేయు"డనుచు॥
మిగులవినయముతోడ, కిన్నెర
మీటినట్లుగ బల్కు కన్నియ

మాటలకు ముదమంది, పురుషుడు
మగువతోన నెను॥
"సంతసించితి నీదుగుణముకు
కాంత ! నినుగన నావిచారము
తరలిపోనేపోయె, పోదాం
దారిజూపు"మనె॥
ఇంతిమదిలో నుబ్బిపొంగుచు
ఇంటివేపుగ నడువసాగెను
ఆమె వెంబడె కొత్తపురుషుం
డరుగుచున్నాడు॥
అంత పడమట పొద్దుగూకెను,
అల్లుకొనె నెల్లెడల చీకట్కి
గూళ్ళకేగెడు పిట్టలింపుగ
కూసెకిలకిలని.
చెవులకింపుగ పాడు పిట్టల
చిఱుతపాటలు వినుచుపోవగ
నడకబడలిక కొంచెమైనను
బడయరాదయ్యె॥
తటుకుమని అంతలోనేదో
తలఁపురాగా కొత్త పురుషుడు,
గుండెఝల్లన, వొళ్ళువణకఁగ
లోననిటుతలచెె॥
"యేమిటిది? మతిపాయెనానా

కేమి? యిట్లిది యెవ్వతో యొక
యింతి వెంబడి కటిక చీకటి
నేడపోతుంటివే ॥
నాదుముద్దులగుమ్మ బాసిన
నాటనుండియు నేటిదాకను
చీకటైనదీ లోకమంతా
నాకనులకకట?
యిన్నాళ్లా లేని యీ తెలి
వేలకలిగిం దిపుడు నా? కీ
యింతి పైపోతుంది నామన,
నేమిటీవింత ! ॥
కటకటా! యేమాయె చెలి? నా
కనులలోపల మన్ను గొట్టెను,
బ్రతికియుంటిని దానిజూడక
బండరాయివలెనే
నాడు వెన్నెల పూలదోటలో
నాదుపజ్జను జేరి మక్కువ
బాసలెన్నో జేసిపోయిన
పడతిరానాయె?
మరచిపోతుందేమొయని నే
మాటిమాటికి ముద్దుబెట్టుకు
"పడతి! రేపిటు రాకపోయిన
బ్రతుకనే నమ్మ" ॥
అన్న, చెలి చెయివేసి చేతులో

అమృతపుముద్దిచ్చి, నాతో,
"యిన్నాళ్లూ నామనసుని
వెఱుఁగ నే లేదే?॥

ప్రాణనాయక! నిన్నుఁగాదని
పట్టగలనే వేరొకని చెయి,
తల్లి దండ్రులుగాదు, లోకము
తల్లడిలసీతాఱుమూ త్రై,
కన్నెనై పూసెజ్జపైనిను
కౌఁగలించిన చేతులకా తల
బ్రాలుబోతునె యెవ్వడో యొక
పరునితలమీఁద?
కన్నెవలపులు కన్నుసైగలు
వన్నె చిన్నెలుజూపి నినునా
వశము జేసుకు, చేతఁజిక్కిన
పక్షిఁబోవిడిచి,॥
తిరిగి ఉరులొడ్డేటి బోయని
తిరు, నినువిడి వేఱొకడికి
చూపుదునె యెంగిలివలపు? చ
స్తుండగామనసు?॥
నాథ! మరిమరి చెప్ప నేలను
నమ్మితిని నారాజు నీవని
యెదను నీకే యప్పగించితి
నెట్టులేయుదువో?॥
మనసునందూ చేతలందూ

మాటలందూ నిన్నె నమ్మిన
కన్నె మాటలు కల్ల లెప్పుడు
గావు, ననునమ్ము॥
అల్లదుగో "కూ"యని కోయిల
యనేడు నిజమని నామాటలు,
గుప్పుగుప్పన పూలవాసన
గుప్పుచున్న దహా!
వీచుచల్లనిగాలి, చుక్కలు
మిణుకుమిణుకని టక్కులాడును,
సంతసమ్మున ముసిముసినగు
చందమామఁగను॥"

మనుచు, తేనెలుచిలుకు తియ్యని
మాటలెన్నో నచ్చబలికి
చేతులో చేయి వేసియింటికి
చెలియ వెళ్ళినది॥

చాలకాలం బైనఁ బ్రేయసి
జాడ తెలియదు ఇంచుకైనను,
కటకటా! చెలిఁజూడకన్నులు
కాయగానెనుగా॥

యేమికర్మమొగాని, చెలితన
యింటివేపుగ తిరిగినప్పుడె
సంతసమ్మున, నవ్వుగులికెడు
చందమామనుపట్టి భ్రమింగెను

కాఱునల్లనిమబ్బుగమి, చీ
కట్లుగ్రమ్మెను చుట్టునెల్లెడ,
కనులుమసకలు గమ్మెనవి, మతి
కలకబాఱినది॥
యేమిటో పిచ్చిగా నామది
ఇటూ అటూ పోతున్నది
కాళ్ళుచేతులు ఆడవో, దడ
కయ్యె గుండెలలో॥
వస్తి కొండంతాశతో, కన
వచ్చు చెలి నిటనంచు, నక్కట!
చెలియజాడ ఒకింతయైనను
తెలియరాదయ్యె॥
చెట్టుపుట్టల నన్ని వెదకితి
చెలియయెచ్చట నున్నదోయని,
కటకటా, చెలిమోముఁ కన్నులు
కాంచనోచవుగా॥
ప్రణయమును మరచితివె చెలి? నా
ప్రాణమీవేయంచు నెంతునె?
యేమి! ఛీ! యీ వెఱ్ఱితలపులు
యేలకలిగినవి?"
అంచు, చింతిలుచామె వెంబడి
నరుగుచుండగ వారికిని ముం
దగుపడియె నొకవింత వెలుఁగపు
డతివయిట్లనియెఁ॥

"కంటిరే! అల్లదుగదే, మా
యింటిదీపము వెలుగుచున్నది.
తొందరగనందువుండు, పోదము
త్రోవమంచిదిగా॥
దల్లదే మనచుట్టుచీకటు
లల్లుకొన్నవి, ఆకసమ్మున
కాఱుమబ్బులు ఒండొకటితో
పోరుచున్నవవే॥"
అనుచుకన్నియ హెచ్చరింపగ,
మనసునందలి చింతలణచుకు,
పరుగుపరుగున పోవసాగెను
పురుషుడట్టులను॥

యెంతనడచినగాని, యింటికి
నింతయైనను చేరబోవరు,
ముందుముందటె యింటిదీపము
ముందువలెపోయెక్॥

ముళ్లువిరిగెను కాళ్ళనిండా,
వాళ్ళు కదుములుకట్టిపాయెను,
వడకుచుండెను దేహమంతా,
నడువలేరైరి॥

ఇంతదూరం బీడ్చితెచ్చిన
యింటిదీపము మాయమయ్యెను,

ఈశ్వరా, వారలకుపాపము
యేమిగతియింక?॥
ఘోరమగా చీకటులనడుమను
కాఱుమబ్బుల యుద్ధగర్జము
చెవులుగడియలువడఁగ జేసెను
దివులుమదిహెచ్చఁగ॥
చేరువనె ఘోరముగ సంద్రము
హోరుమని ఘోషించుచుండెను,
గుడ్లగూబలు ఉఊఊయని
కూకలిడెచెంతఁగ॥
ముందుబెట్టఁగలేక కాళ్ళను
కిందచదికిలబడిరి, భీతిని
డెందమంతయు కలతజెందగ
గుండుచునుమిగులఁగ॥
ఉఱుములును మెఱుపులును మెండై
జలజలాయెను, ధళధళకను,
పటపటపటాగగనమంతయు
బద్దలయిపోయెఁగ॥
కడవల కడుబడినట్టుగ
దడబడదడబడవడిగను
కడుబెడిదవుధారలతో
జడివానబడెఁగ॥
తడిసిముద్దయి వడకుచునుకడు
తల్లడిల్లెడు వారిచేరువ

ఫెళఫెళఫెళా ఫెళఫెళాఫెళ
పిడుగొకటిబడియెఁ॥
పిడుగుతాకున నొడలు తెలియక
పడిరిశవములయట్లు, వర్షము
పూర్తిగా కసిదీర్చుకొని, తా
వొందె శాంతమును॥
కొంత సేపుకు వాళ్ళు తెలియఁగ
నుంతకన్నులు విప్పికని, వే
యింతలధికము భీతిగా, నటు
లేపరుండిరటఁ॥
తెల్లవారెను కొంతనడికిని,
తెలివిబొందెను లోకమంతయు,
కూళ్ళువెడలుచు పిట్టలింపుగ
కూసె మేల్కొల్పుల్॥
చల్లగాలులు వీచి అలలుగ
మెల్లమెల్లన ఒడలిబడలిక
యెల్లబాపగ, నిద్ర మేల్కొని
రిరువురొకసారె॥
లేచి, కన్నులు నులిచి, మొగములు
చూచుకొని, యోచించుచుండిరి,
గ్రమ్మెనెల్లెడ నాకసంబున
కాంతిపుంజంబుల్॥
అబ్బురంపడ నెల్ల జగములు,
మబ్బుతెఱజీల్చుకొని, తేజం

బుబ్బిలోకము నెల్ల ముంచగ
సూర్యుడుదయించెన్.

అంతకన్నియజూచి పురుషుడు
వింతసంతస మొప్ప మోమున,
"కాంతరో యీ పల్లెయెచ్చట
కలదు చెప్పగదె ?॥

కనులపసతగ్గ లేదింకను
కాంత, నా ప్రేయసివి కావటె ?
సుందరీ, నీముద్దుమోమున
నుందదుగో మచ్చ?॥

ప్రేయసీ, నా ప్రాణమా, నా
యాయువునకున్ పట్టుకొమ్మరో,
ప్రియుడగానటె కాంతరోసి
ప్రియుడగానంటె॥

రావె, శ్రమదీఱంగ కౌగిలి
నీవె, ప్రాణము బిగియబట్టితి
నీదుసౌఖ్యమునకె యున్నా
ళ్ళింక జాగేలె?"

అంచు, తమకిమునీఱుచెలి నం
కించుకొని కౌగిటను ముద్దుల

ముంచివేసెను ఆపె చెక్కులు
ముద్దుమోమంతట॥

చెలియ తన ప్రాణేశు మోమును
కలయజూచుచు, ముందుజరిగిన
కల్లనిజములు బుద్ధిబలమున
కనులగట్టనట॥

"ప్రియుడ, నినుపూదోటబోపల
విడిచియింటికిపోవుచుండగ,
కనులకగుపడె వింతవెలు, గది
కంటి, భ్రమగంటిట॥

ఎటకుపోతినో, యేమిచేస్తినొ,
దిటముగా నేజెప్పజాలను,
కటకటా, కననింతవరకును
కన్నవారలను॥

యెవ్వరెచ్చట నున్నదించుక
యెఱుగనైతిన దేమిమాయమొ,
పల్లెలోపలనుంటి నెచ్చటి
బంధువులోవారు॥

నాయకా, నినుఁగంటిగా, యి
న్నాళ్ళకును నాభాగ్యవశమున,

కుదుటపడె ప్రాణములు నావగు
కోర్కెలీడేరె॥

ప్రాణనాయక, మనలపైతమ
ప్రాణముల నిలుపుకొని యున్నా
రయ్యో, మన తలిదండ్రులను గన
నరుగుదము వేగ॥

బ్రతికియున్నన్నాళ్ళు ఒండొరు
బాయకుండగ, ప్రేమసంద్రము
నీదుదము మోదమ్ము మీరగ,
పోదమికరమ్మ్"॥



